"ఇంత స్వల్పకాలములో యెంత చిత్రమయినమార్పు! రామయ్యా నిజంగా రామయ్యా యేనా? ఆ మాటలు అన్నది రామయ్యా యేనా?" అని అనుకొన్నాడు వాసుదేవరావు. రామయ్య మళ్ళీ ప్రారంభించాడు. "కమలాకరము వంటి కొడుకు, సుశీలవంటి కూతురు, సీతవంటి కోడలు, నారాయణమూర్తివంటి అల్లుడు లభించుటకు మీరే పూనుకొన్నారో? ఇలాంటి కుటుంబాలు ఆంధ్రదేశములో నాలుగుంటే ఆంధ్రులు విజయ ధ్వజము నెత్తరా? మీవంటి ధీవిశాలురును, నారాయణమూర్తివంటి ప్రతిభావంతులను గన్న ఆంధ్రమాత కింకే లోపమున్నది?——"
అని ఆనందాతిరేకమున యేమేమో అంటున్నాడు.

ఇంతలో వాసుదేవరావు "ఎంతకాలమైంది మిమ్ములనుచూచి?" అన్నాడు.

"ఔను! ఇటీవల పెద్దగ్రంథమే వ్రాసినారు. మీచరిత్రంతా విన్నాను. అన్నసత్రము, యువతి విద్యాలయము, మున్నగు వాటినిగూర్చి కూడా తెలుసుకొన్నాను. "హిందూమిత్రము" చూస్తున్నాను. ఇన్నింటికి మూలకారణము మీరేనని నానమ్మకము. నా సంతోషాన్ని ఆపుకొనలేక, సమయ మనివి. చేసుకొనవలెనని వచ్చాను. నా ఆస్తి అంతా సీతమ్మకు కమలాకరమునకు స్వాధీన పరచినట్లు వ్రాయించాను. ఆ ఆస్తిని వారు వారి యిష్టమువచ్చిన ధర్మకార్యములకు వినియోగ పరపవచ్చును. ఒక్క పర్యాయము సీతమ్మను, కమలాకరమును చూచి పోవలెనని నాఅభిలాష. ఆ దివ్యమంగళ స్వరూపములను జూచుటకు అవకాశమున్నదా?" అన్నాడు రామయ్య.

"అభ్యంతరములేదు—సీతా! ఇలారా! అని వాసుదేవరావు పిలచి కమలాకరమును, "లేచి నమస్కరించ"మని కళ్ళతో తెలియజేశాడు. సీతమ్మ అడుగులు తడబడుచు వచ్చింది. కమలాకరములేచి, సీతను పిలుచుకొని, ఉభయులు రామయ్యాకు నమస్కరించారు. రామయ్య మనసార దీవించాడు. అతని హృదయములో దివ్యరాగముదయించింది. అప్పుడే వర్షపు తుంపురులు పడ్డయి.

రామయ్యాగారి ధనముతో కమలాకరము, ఒక జాతీయ కళాశాలను నిర్మించి "ఆంధ్రులు" అని ఒక పత్రికను కూడా సాగించాడు. రామయ్య యివన్ని కళ్ళపండువుగా చూచి, సంతసించి, నిండుమనస్సుతో మరియొక పర్యాయము దీవించాడు.

జై! ఆంధ్రాభ్యుదయమునకు జై!!